నెవరిని ప్రేమతోడను, లాలనతోడను జూతునో, యట్టి సత్యసంకల్పుఁడును, సకలైశ్వర్యసంపన్నుఁడును, దయాసాగరుఁడును, భక్తవత్సలుఁడును, పరమపవిత్రుఁడును, పరమోదారుఁడును, పరమకారుణికుఁడును, పరమపూజ్యుఁడును, సర్వసుందరుఁడును, సకలగుణనిధానమును, లేక, సంక్షేపముగఁ జెప్పవలసివచ్చినచో సగుణుఁ డనియు, ప్రేమగమ్యుఁడనియు, వ్యక్తుఁడనియు (అనఁగా: ప్రత్యక్షరూపధారి యనియు), సులభుఁడు నగు పరమేశ్వరుఁడే మనుజుని యొక్క భక్తికొఱకు స్వభావముగనే యవతరించుచున్నాఁడని, యేధర్మముఁ జూచినను గాన్పించుచున్నది. మూలమునందు 'ఏక మే వాద్వితీయం' అయిన పరబ్రహ్మము, ప్రేమయు, శ్రద్ధయు మొదలుగఁ గలిగినమనోమయములగు నుపనేత్రములచే మనుజులకు గోచర మగును. కడపట చెప్పఁబడిన రెండువిధములయిన స్వరూపములనే వేదాంతశాస్త్రమునం దీశ్వరుఁడని యనుచున్నారు. "పరమేశ్వరుఁడు సర్వవ్యాపి యైనను పాండురంగమూర్తియు, విఠోబాయును నేల చిన్నమూర్తులుగ నున్నారు?" అనుప్రశ్నమునకు "హరితుకామ్హాణె అవఘా ఏకలా, పరిహోధావలా భక్తసారీ." "ఒకహరియే యంతటను వ్యాపించినవాఁడుగను, సర్వసముఁడుగ నున్నాఁడు; అయినను భక్తికొఱకు ఆభగవంతుఁడు కొద్దివాఁ డగుచున్నాఁడు"—అని తుకారాంబువాగారు సమాధానమును జెప్పిరి (గా. ౩౪. ౭). ఆసిద్ధాంతమే వేదాంతసూత్రములయందు వ్రాయఁబడినది (౧. ౨. ౭). ఉపనిషత్తులలో నేయేస్థలములయందు బ్రహ్మోపాసన వర్ణింపఁబడినదో యాయాస్థలములయం దెల్ల ప్రాణము మనస్సు మొదలగు సగుణవస్తువులును, నవ్యక్తవస్తువులును మాత్రమే నిర్దేశింపఁబడక యొకానొకప్పుడు సూర్యుఁడు (ఆదిత్యుఁడు), లేక, యన్నము మొదలగు సగుణము లగు వ్యక్తపదార్థముల యొక్క యుపాసనయుఁ జెప్పఁబడినది (తై. ౩. ౨. ౬.; ఛాం. ౭). మఱియు శ్వేతాశ్వతరోపనిషత్తునందు "మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్"—"ప్రకృతికి మాయ యని పేరు గాన, నామాయకధిపతి యగువాఁడే మహేశ్వరుఁడు" (శ్వే. ౪. ౧౦) అని యీశ్వరలక్షణము చెప్పినపిదప "జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః"— "ఈదేవుని తెలిసికొనె నేని సర్వపాశములనుండియు ముక్తుఁడగును (౪-౧౬) అని యనేకస్థలములయందు గీతలయందువలెనే సగుణుఁ డని చెప్పఁబడినది (గీ. ౧౦. ౩.). ఉపాస్య బ్రహ్మముయొక్కచిహ్నము, ఆనవాలు, అవతారము, అంశ, లేక ప్రతినిధి యని పేర్కొని యుపాసనార్థమై యావశ్యకము లైన యీనామరూపాత్మకములగు వస్తువులనే వేదాంతశాస్త్రమునందు